# మన విద్యా సమస్య
## (Our Educational Problem)

లాలా హర్‌దయాల్



లాలా లజపతి రాయ్




మూలం
పంజాబ్ కేసరి
**లాలా లజపతి రాయ్**

స్వేచ్ఛానువాదం
**గౌరవ్**



**విద్య అధ్యయన వేదిక**
తెలుగు రాష్ట్రాలు

# మన విద్యా సమస్య – లాలాలజపతిరాయ్

(Introduction written by Lala Lajpat Rai for Lala Har Dayal's book our educational problem)


స్వేచ్ఛానువాదం : గౌరవ్

మొదటి ప్రచురణ : 1922

తెలుగులో : 2017

ప్రతిపాదిత చందా : 5/–

విద్య అధ్యయన వేదిక





ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com




**“ ఆ సభలో హరదయాళ్‌గారు ఉపన్యసించారు. అలాంటి విప్లవ వీర వాక్కులను, ప్రతిభాశాలిని నా జీవితంలో ఆరోజు వరకు చూడలేదు. అతని రాజకీయోపన్యాసం అనన్యము, అత్యద్భుతము అన్పించింది.. అట్లా ఖచ్చితంగా ఖండించే శక్తిగల నిశిత విమర్శకుణ్ణి, స్పష్టంగా కళ్ళకు కట్టినట్లు రాజకీయాలను చిత్రించిన మరొకవ్యక్తిని అదివరలో నేను ఎరిగి యుండలేదు.... ఈ విప్లవ వీరుని ప్రబోధం నాలో విచిత్రమైన ఉద్రేకాన్ని పురికొల్పింది. నా జీవిత దృక్పథమే మారిపోయింది. ”**

**– దరిశి చెంచయ్య,** నేను–నా దేశం

## ఒక్కమాట

చరిత్ర రచనలో అన్యాయం జరిగిన వ్యక్తులలో లాలా హర్‌దయాళ్* ఒకరు. బాల్యంలోనే ఆర్య సమాజం ప్రభావానికి లోనై వినాయక దామోదర సావార్కార్, బికాజికామా మొదలగు వారి సహచర్యంతో మాజినీ, మార్క్స్, బకూనిన్‌ల దార్శనిక దృష్టిదాకా నాస్తికుడిగా, విప్లవకారుడిగా, సామ్యవాదిగా, బౌద్ధుడిగా, అరాజకవాదిగా, శాంతి కాముకుడిగా వివిధ స్వభావాల్ని అనుభవించిన అరుదైన వ్యక్తి హర్‌దయాళ్. భారతీయ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకై విదేశీగడ్డమీద పురుడుపోసుకుని గర్జించిన గదర్ పార్టీ హర్‌దయాళ్ మానసపుత్రికే నంటారు. ప్రపంచంలోని అనేక దేశాల విప్లవకార్యకలాపాల్లో హర్‌దయాళ్ నిర్వహించిన అద్వితీయపాత్రపై ఇంకా పరిశోధించాల్సిన అవసరముంది. ఢిల్లీలో పుట్టి పంజాబ్ యూనివర్సిటీ మొదలుకుని పారిస్, అల్జీరియా, అమెరికా, హవాయి, జర్మనీ, స్విట్జర్లాండ్ వంటి ఎన్నో ప్రదేశాల్లో సంచారిగా తిరిగాడు. ‘ది ఇండియన్ సోషియాలజిస్ట్’ పత్రిక ప్రభావంతో అరాజకవాదిగా మారి పారిస్ నుంచే ‘వందేమాతరం’ పత్రికను స్థాపించి నడిపాడు. గురుగోవింద్‌సింగ్ స్మృతిచిహ్నంగా పేద విద్యార్థులకి ఉపకారవేతనాలు అందజేసేవాడు. శాన్‌ఫ్రాన్సిస్‌కోలో ప్రపంచ పారిశ్రామిక కార్మిక సమాఖ్యకు కార్యదర్శిగా చేసాడు. తదనంతరం కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీ ఆఫ్ జర్మనీలో చేరాడు. తర్వాత ‘బకూనిన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కాలిఫోర్నియా [ప్రపంచంలో మొట్టమొదటి అరాజకత్వ ఆశ్రమం (First monastery of Anarchism)] స్థాపించాడు. అప్పటికే స్టాన్‌ఫోర్ట్ విశ్వవిద్యాలయంలో సంస్కృతాచార్యుడిగా చేస్తున్న పదవికి రాజీనామా చేసాడు. అమెరికాలో అరెస్టయి తప్పించుకుని జర్మనిలోని బెర్లిన్ వెళ్ళాడు. తర్వాతో దశాబ్దంపాటు స్వీడన్ వెళ్ళాడు. యూనివర్సిటీ ఆఫ్ లండన్‌లో స్కూల్ ఆఫ్ ఒరియంటల్ ఆఫ్రికన్ స్టడీస్‌పై పి.హెచ్‌డి పట్టా పుచ్చుకున్నాడు. అలా

* దక్షిణ దేశపు ప్రప్రథమ రాజకీయ ఖైదీగా పేరొందిన దరిశి చెంచయ్యగారు సుదీర్ఘమైన తన ఆత్మకథ ‘నేను – నా దేశం’ ద్వారా చరిత్ర విస్మరణకు లోనైన ఇద్దరు మహనీయుల్ని తెలుగువారికి పరిచయం చేశారు. మొదటి వ్యక్తి లాలా హరదయాళ్. రెండోవ్యక్తి కాట్రగడ్డ బాలకృష్ణ, భారతీయ విప్లవోద్యమ చరిత్రలో ఇద్దరికీ అన్యాయమే జరిగిందని నా భావన. హరదయాళ్ ఉపన్యాసం వినడం, అదాయనపై విపరీతమైన ప్రభావం కల్గించడం, స్వామి వివేకానందుడి విషయంలో లాలా హరదయాళ్‌కి, జితేంద్రనాథ్ లాహిరి అనే విద్యార్థికి చర్చ తలెత్తడం విద్యార్థి దశలోనే ప్రభుత్వమిచ్చిన ఉపకార వేతనాన్ని తిరస్కరిస్తూ,

ప్రపంచవ్యాప్తంగా సంచార జీవిగా నిరంతరం సంచరిస్తూ ఫిలడెల్ఫియాలో మరణించాడు. ప్రపంచంలో ఎన్నో దేశాల్లో ఎంతోమందికి స్ఫూర్తిదాత హరదయాల్. శరత్ సృష్టించిన ప్రసిద్ధ పాత్ర 'డాక్టర్ సాబ్' హరదయాల్‌దేననే వాదనుంది. అలాగే హరదయాల్‌ది సహజ మరణం కాదనీ విషప్రయోగంతో చంపబడ్డాడనే వాదనా ఉంది. హరదయాల్ Our Educational Problem అనే వ్యాసపరంపర రచించాడు. అలాగే ప్రపంచ మతాల్ని విశ్లేషిస్తూ 'Glimpsess of world Religions', బౌద్ధాన్ని గురించీ 'Bodhisatva Doctrines' మొదలగు గ్రంథాలు రచించాడు. నిరంతర సన్యాసిగా చిల్లిగవ్వకూడా లేకుండా అనితరసాధ్యమయిన జీవితం గడిపిన హరదయాళ్ పూర్తి జీవితం ఇంకా వెలుగు చూడవలసే ఉంది. ప్రస్తుత విషయానికొస్తే హరదయాళ్ 'Our Educational Problem' గ్రంథం 1922లో ముద్రించబడింది. దీనికి పరిచయం రాయవల్సిందిగా లాలాలజపతిరాయ్‌ని కోరామని ఐతే ఆయన అరెస్టు కావటం వలన ముద్రణ కోసం పంపేసామని, ఇంతలో తిలక్ రాజకీయ పాఠశాల డైరక్టర్ భాయి పరమానంద నుంచీ లేఖ వొచ్చిందనీ, లజపతిరాయ్ ప్రమాణం చేసిన పీఠిక ఆయనకు అందించారనీ, విలువైన ఆ పీఠికను తిరిగి చేర్చి ప్రచురించడం వల్ల ఆలస్యమైందనీ ఐతే లాలాజీ సూచించిన మోడ్రన్ రివ్యూ వ్యాసాలిందులో ప్రచురించలేక పోతున్నామనీ మార్చి 5, 1922న ఆర్. ఎమ్. కపాడియా రాసిన ముందుమాటతో ఈ గ్రంథం వచ్చింది. లజపతిరాయ్ సూచించిన హరదయాళ్ మోడరన్ రివ్యూలోని విద్యాసంబంధ వ్యాసాలు బ్రిటిష్ విద్యావిధానానికి వ్యతిరేకంగా ఉన్నవి, అవి 1969లో 'Thoughts on Education' పేరుతో గ్రంథంగా వెలువడినాయి. ఐతే 'Our Educational Problem'కు లజపతిరాయ్

---

హరదయాళ్ చేసిన ప్రసంగం, శ్యాంజీకృష్ణవర్మనే విప్లవకారుడి భావాల ప్రభావం హరదయాళ్‌పై ఉండటం, సోషల్ కాంక్వెస్ట్ ఆఫ్ ఇండియా అనే ఆయన వ్యాసాన్ని భారతదేశం నిషేధించడం, కార్ల్‌మార్క్స్-మోడ్రన్ ఋషి అనే ఆసక్తికర రచన హరదయాళ్ చేయడం, అమెరికాలో హరదయాళ్ అరెస్టయినప్పుడు ఒక ఐరిష్ విప్లవకారిణి 35,000 రూపాయలు జామీను ఇచ్చి ఆయన్ని విడిపించడం, ఉడ్రోవిల్సన్ వంటి అమెరికా అధ్యక్షునికి కూడా హరదయాళ్ అంటే అభిమానముండటం, హరదయాళ్‌ను అమెరికా బహిష్కరించడం మొదలైన వివరాలెన్నో చెంచయ్యగారు తన స్వీయచరిత్రలో చర్చించారు. హరదయాళ్‌పై తెలుగులో ఆమాత్రం రాసింది మొదట దరిశి చెంచయ్యగారే కావచ్చు. (చూడు. నేను - నా దేశం, దరిశి చెంచయ్య, జయంతి పబ్లికేషన్స్, విజయవాడ-2004)



రాసిన పరిచయం అనువాదం చేయడం అవసరమనిపించింది. నిజానికి హరదయాళ్ పుస్తకాలన్నీ తెనిగీకరించడం మంచిదే ఐనా, నా ఆశక్తత దృష్ట్యా ఇప్పటికీ పరిమిత కార్యాన్ని మాత్రమే మోసే బాధ్యత తీసుకున్నాను. పంజాబ్ కేసరిగా పేరొందిన లజపతిరాయ్ జీవితం కూడా ఆద్యంతం సాహసోపేతం. కొద్దిపాటి వ్యత్యాసాలు మినహా ఆయన రాసిన మాటలు ఈనాటికీ యథాతథంగా వర్తిస్తాయనే భావంతోనే వెలుగులోకి తేవడం జరుగుతోంది. విద్యా సంబంధ విషయాలపై అధ్యయనం చేయడమే లక్ష్యంగా ఏర్పడిన **'విద్య అధ్యయన వేదిక'** ద్వారా ప్రచురించబడుతోన్న ఈ చిన్నిపొత్తంలోని విషయాలు ఎంత మాత్రంగానైనా ఎవరికి ఉపయోగపడినా ఈ కృషి ఫలించినట్లే. ప్రత్యామ్నాయ విద్య గురించిన వివిధ చర్చలు తలెత్తుతున్న ప్రస్తుత సందర్భంలో ఈ ప్రచురణ అవసరం మరింత పెరిగిందనే ఆలోచనే ఈ ముద్రణకి ప్రేరణ. లాలాహరదయాళ్ గ్రంథం పేరే సరైందిగా తోచడంతో లజపతిరాయ్ పరచయానికి ఆపేరే తెలుగులో పెట్టడం జరిగింది. అనువాద లోపాలకూ, అక్షర దోషాలకూ నాదే బాధ్యత.

**- అనువాదకుడు**

---

**"గదర్‌పార్టీని స్థాపించిన విప్లవనాయకుడు లాలా హరదయాళ్ గురించి కొన్ని వివరాలు రాయడం అవసరం. హరదయాళ్ జన్మస్థానం ఢిల్లీ. పంజాబ్ యూనివర్శిటీలో ఎమ్.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. యూనివర్శిటీ ప్రతీ పరీక్షలోనూ ఈ ప్రతిభాశాలికి అత్యధికంగా మార్కులొచ్చేవి. ఎమ్.ఏ. పరీక్షలో అప్పటి వరకూ ఎవరికీరానన్ని మార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు. ప్రతీ సబ్జెక్టులోనూ సాటిలేనివాడనిపించుకున్నాడు. ముఖ్యంగా కొన్ని కళలలో, శాస్త్రములలో ఆయనకి వచ్చినన్ని అధిక మార్కులు అంతవరకూ ఎవరికీ రాలేదని పంజాబీయులంటారు. సునిశిత మేధావి. ఇలాంటి ప్రతిభాశాలుల్ని బ్రిటిష్ ప్రభుత్వం తమ బుట్టలో వేసుకోవడానికి విద్యార్థి వేతనాల్ని ధారాళంగా ఇచ్చి, ఇంగ్లండుకు ఐసిఎస్ చదవడానికి పంపుతుండేది. కానీ హరదయాళ్ విషయంలో ప్రభుత్వం యత్నం ఫలించలా. ఆయన బ్రిటీష్ సామ్రాజ్య వాదానికి తొత్తు అవడానికి బదులు శత్రువయ్యాడు. విప్లవ నాయకుడయ్యాడు."**

**- దరిశి చెంచయ్య,** నేను-నాదేశం

# మన విద్యా సమస్య

విద్యా సమస్యకు సంబంధించీ ఒక విధమయిన గందగోళం నాలో నెలకొని ఉంది. దేశ ప్రయోజనాల రీత్యా ఈ అంశాల్ని అధ్యయనం చేసేందుకు నేనెంతో కాలాన్నీ, శక్తినీ వెచ్చించాను. నేను కొన్ని ప్రయోగాలు కూడా చేసానుగానీ ఈ సమస్య ఇంకా నా తెలివిని తికమకపెడుతూనే ఉంది. నాగరిక జీవితం ఈ సమస్యను మరింత క్లిష్టం చేసింది. మన విషయంలో ఐతే, జనాభా సమస్య, ప్రభుత్వంచే పరిచయం చేయబడుతున్న విదేశీ పరాయి సంస్కృతీ ఈ సమస్యనింకా క్లిష్టంచేసాయి. అయితే, ఒక్క విషయం మట్టుకు చాలా స్పష్టంగా గమనించాను. అదేంటంటే ఈరోజు భారతదేశంలోని అధికారిక విశ్వవిద్యాలయాల ద్వారా పాలక సంస్థల ద్వారా రుద్దబడుతున్న విద్యావ్యవస్థ ఏదైతే వుందో అది వీలైనంత దీర్ఘకాలం మన రాజకీయ బానిసత్వాన్ని పెంచీ మనల్ని గందరగోళపరచడమేకాక ఆర్థికంగా కూడా మనల్ని నిష్ప్రయోజనంగా, అసమర్థులుగా మలచడం కూడా చేస్తోంది. స్వపరిపాలననేది సాధ్యమైనా కూడా ఆర్థిక సామర్థ్యాన్ని సముపార్జించుకోవడం అంత సులువుకాదు. ద్రవ్యవ్యయంపై విస్తృతమైన ప్రయోగాలు చేసాకనే అది సాధ్యం.

1908లో లాలా హరదయాళ్ 'పంజాబీ' పత్రిక కోసం ఈ వ్యాసాలు రాసినపుడు అసలే విధమయిన విద్య లేకుండా ఉండటం కంటే ఏదో రకమయిన విద్య ఉండడమే మంచిదన్న నమ్మకంలో నేనున్నాను. కానీ, నా అభిప్రాయాలు చెప్పుకోదగ్గగా మారాయి. ఒక నిర్దిష్టమైన దశదాకా ఈ విద్య కొంత మంచి చేసిందని నేననుకుంటున్నాను. ఐతే, గతకొన్ని సంవత్సరాలుగా ఈ విద్యోత్పత్తి నిశ్చయంగా హానే చేస్తోంది. ఆర్థికపరమయిన, మేధోవంతమయిన పరాన్న జీవుల్ని విస్తారంగా తయారుచేసీ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల వైపు సాగుతున్న మన పురోగమనాల్ని క్షీణింపచేసి ఆలస్యమయ్యేటట్లు చేస్తోంది. బ్రిటిష్ విద్యావిధానం గురించీ, వారి ఉద్దేశాల గురించీ నాకే విధమయిన సందేహాలూ లేవు. కానీ ఈ వ్యాసాలతో పాటూ 1908-10 మధ్య కాలంలో మోడరన్ రావ్యూ పత్రికా సంపాదకుడు ప్రకటించిన మరికొన్ని వ్యాసాలు నా అనుమానాల్ని నిర్ధారించాయి. గాంధీ ప్రచారం, రాజకీయ స్వాతంత్ర్యం కోసం ప్రస్తుతం జరుగుతున్న పోరాటం ద్వారా సంపాదించిన అనుభవాల ప్రభావంతో విద్యను పరిశీలించే అవకాశాలు నా వాస్తవ విశ్వాసాలను బలపరిచాయి. ఇప్పుడీ క్షణంలో ప్రస్తుతమున్న విద్యావ్యవస్థ ఉపకారం కంటే అపకారమే ఎక్కువ చేస్తుందని నేను బలంగా నమ్ముతున్నాను. ఈ విద్య మనల్ని అశక్తుల్నీ, దుర్భలుల్నీ చేస్తుంది.



జాతిని నిర్వీర్యపర్చి, నిర్లిప్తంచేసి అధఃపాతాళానికి చేరుస్తుంది. నిరక్షరాస్యుడయిన సోదరుని కంటే విద్యావంతుడే రాజకీయస్వేచ్ఛకీ, స్వాతంత్ర్యాభివృద్ధికీ ప్రధానమయిన అవరోధంగా తయారవుతాడు. ప్రభావశీలమైన ప్రతిబంధకంగా మారతాడు.

అందువల్ల లాలాహర్‌దయాళ్ యొక్క ఈ వ్యాసాలు ప్రజల్ని చైతన్యవంతం చేయడానికెంతగానో ఉపయోగపడతాయి. నా కోరికనిలా తీర్చడానికి సిద్ధపడిన బొంబాయి మిత్రుడు రంగీల్‌దాస్ కపాడియా వ్యాసాల్నిలా పొత్తం రూపంలోకి తీసుకురావాడాన్ని నేను స్వాగతిస్తున్నాను. ఈ వ్యాసాలు లాలాహరదయాళ్ ప్రస్తుత భావాలకి ప్రాతినిధ్యం వహించకుండా, మార్పులు, చేర్పులేవీ లేకుండా పునర్ముద్రించబడుతున్నాయి. నిజానికి ఇప్పుడతని భావాలేమిటో మనకి తెలీదు. ఈ వ్యాసాల విలువ అతని భావాలపై కన్నా ఇందులో తన భావాలకి మద్దతుగా ఇచ్చిన ఉల్లేఖనాల్లోనే ఎక్కువుంటుంది. ఈ సంకలనం మరింత సంపద్వంతమవడానికి గానూ ప్రచురణకర్తలు మోడరన్ రివ్యూకు రాసిన వ్యాసాల్ని కూడా దీంట్లో చేరిస్తే బావుంటుందని నా కోరిక.

## పాశ్చాత్య పద్ధతులు, పాశ్చాత్య సంస్కృతి యొక్క విలువ

ఈ సంక్షిప్తమయిన ముందుమాటను ముగించే ముందు పాశ్యాత్య సంస్కృతి వారి విధానాల విలువను గురించీ రెండు ముక్కలు చెప్పాలనుకుంటున్నాను. ఈ అంశంపై మెస్సర్స్ అండ్ జార్ట్ అనిన్ కో. లండన్ వారు ప్రచురించిన "భారతదేశంలో జాతీయ విద్యా సమస్య" అనే నా గ్రంథంలో భావాల్ని ఏకరువు పెట్టాను. ఈ భావాల్ని నేను కలిగి ఉన్నానని చెబితే సరిపోతుందేమోకానీ ఒకవేళ నేను కనుక మళ్ళీ అదే గ్రంథాన్ని తిరిగి రచించవల్సివస్తే కొన్ని మార్పులు ఖచ్చితంగా చేస్తాను కానీ ఆ మార్పు నా మూల విశ్వాసాలపై ఎంతమాత్రం ప్రభావం చూపదు, నా ప్రాథమికమైన నమ్మకాలకు విఘాతం కలిగించదు. పాశ్చాత్యులు విద్యా విధానాల్లోనూ, విద్యా సిద్ధాంతాల్లోనూ ఎంతగానో పురోగమించారు. శాస్త్ర విజ్ఞానంలోను, శాస్త్రీయ పద్ధతులలోనూ అపాయమనుకుంటే తప్ప భారతదేశం పాశ్చాత్యులు సాధించిన ప్రగతి పట్టనట్లుండరాదు. పాశ్చాత్య సంస్కృతిలోని భయంకరమయిన దుష్టత్వం, క్రూరమయిన స్వభావాల్ని భారతీయులు అధ్యయనం చేసి అంతుతేల్చాలి. వారి దుష్ట లక్షణాలపై పట్టు సంపాదించకుండా వాట్ని పట్టించుకోకపోవడం మనం చేయరాదు. కాబట్టీ నేనిక్కడ ఇంత గట్టిగా భారతీయ అధికారిక విశ్వవిద్యాలయాలచేత, ప్రభుత్వ విద్యాలయాలచేత బలవంతంగా పెంపొందించబడుతూ, రుద్దబడుతున్న విద్యని వ్యతిరేకిస్తున్నానంటే, దానర్థం పాశ్చాత్య సంస్కృతికీ, శాస్త్రాలకీ నేను

వ్యతిరేకమని కాదు, మన విద్యార్థుల్లో కావాలని పెంచిపోషిస్తున్న బానిస ఆలోచనా విధానాలు, బానిస వ్యక్తిత్వ నిర్మాణాల్ని వ్యతిరేకిస్తున్నానని మాత్రమే. ఈ విద్య ఏదైతే ఉందో అంటే దీని పద్ధతులు, క్రమమూ మన సొంత భాషనీ, మనదైన సంస్కృతినీ మనమే తృణీకరించి అసహ్యించుకునేలా చేస్తుంది. యూరోపియన్ జీవితఅలవాట్లను అనుసరిస్తూ, యూరోపియన్ సరుకులు లేనిదే సంతృప్తి చెందని జాతిని ఉద్భవింప చేస్తుంది. పరాయి పాలకులు విదిల్చే ఎంగిలి మెతుకుల కోసం, విదేశీ ప్రభుత్వంపై ఆర్థికంగా ఆధారపడేందుకు మనమంతా సిద్ధపడుతున్నాం. ఇది మన జాతి గౌరవాన్నీ, ఆత్మగౌరవాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ, నాశనం చేస్తుంది. పరాయి ప్రభుత్వాలపట్ల వొదిగిమదిగి ఉండే భక్తిభావాల్ని ప్రోత్సహిస్తుంది. విదేశీ పాలకుల ఆదర్శాలకి అణిగిమణిగి ఉండే పరాయీకరణని ప్రేరేపిస్తుంది. ఈ విద్యా విధానాన్ని రూపొందించిన వాళ్ళ ముఖ్యోద్దేశ్యం ఇదే. వాళ్ళ కోరిక నెరవేరింది. ఈ క్రమంలో లాలాహరదయాళ్ వ్యాసాలు నేటి భారతీయ తరాల్లో విలువ కలిగి ఉంటాయనటానికి ఎలాంటి సందేహం లేదు.

**– లాలా లజపతిరాయ్**

---

**"హరదయాళ్ గొప్పవాడనడానికి అనేక ముఖ్య కారణాలున్నాయి. ఆయన పదే పదే ఆలోచించుకుని స్థిరపరచుకొన్న ఆదర్శాలను ఆచరణలో పెట్టేవాడు. ఇతరులకు బోధించిన ప్రకారం ఆచరించేవాడు. నిరాడంబర జీవి. ఉన్నత ఆదర్శాలు, ఋజు ప్రవర్తన గల తత్త్వవేత్త...**

**నా జీవిత దృక్పథంలో కొందరు మహనీయులు మార్పులు తేగలిగారు. వారందరిలోనూ హరదయాళ్ మన మాతృదేశ స్వాతంత్ర్యోద్యమానికి ప్రాణత్యాగం సహితం చేయుటకు సంకల్పించుకునే లాగు నన్ను మార్చివేసాడు. నాలాగే వేలమంది ఆయన ప్రభావం వల్ల మారిపోయారు. గదర్ ఉద్యమంలో ఎందరో ఉరికంబాలెక్కారు; తుపాకి కాల్పులకు రొమ్మువిరిచి నిలబడ్డారు. అండమాన్‌లోనూ, నిరాహార దీక్షలలోనూ మరణించారు; హరదయాళ్ అద్భుత శక్తిని విపులంగా వ్రాయగల శక్తి నాకు లేదు."**

– **దరిశి చెంచయ్య,** నేను-నాదేశం